శ్రీరస్తు.

శ్రీ హయగ్రీవాయనమః

అష్టోత్తర

# జానకీపతిశతకము

———:o:———

వ్యాకరణ శిరోమణి

శ్రీమాన్ శృంగారం అయ్యమాచార్య

విరచితము.

---

రెండవ కూర్పు 1000 ప్రతులు.

ఏలూరు :

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

---

 1924. [వెల 0—2—6.

# విజ్ఞప్తి.

---

భక్తాగ్రేసరులారా !

అనేక కష్టభూయిష్టమైన యీసంసారము దుష్టజంతు భయంకరమైన ఘోరసముద్రమువంటిదనియు, దానిఁదరించుటకు నిశ్చలమగు దైవభక్తియే గొప్ప నౌకవంటిదనియు, మహానుభావులెల్లరు చెప్పుట సుప్రసిద్ధము. అట్టిభక్తి, యింద్రియనిగ్రహము, చిత్తశుద్ధి, జ్ఞానవైరాగ్యములు లేనిచో దిట్టపడదు. కావున తదనుకూలముగా నెల్లరకు ననుభవసిద్ధములగు కొన్ని లోకపరిస్థితుల నిందుఁ బొందుపఱచి పండిత పామర రంజకముగా సులభమగు మృదుమధురశైలినిది రచింపఁబడినది. ఇందు నిండియుండు భక్తిరసమును గుఱించి విస్తరించి వ్రాయనేల? చదువరులకే తేటపడఁగలదు. కాఁబట్టి యీగ్రంథము బాలురకు వృద్ధులకు, ముఖ్యముగా భగవద్భక్తులకు నిరంతర పఠనీయము. ఇహపరసాధకము. కాన విన్నవించితిని.

ఇట్లు,

శృంగారం అయ్యమాచార్యులు,

వ్యాకరణశిరోమణి.

శ్రీరస్తు.

శ్రీ హయగ్రీవాయనమః.



అష్టోత్తర

# శ్రీ జానకీపతిశతకము.



శ్రీరఘురామ దేవముని • సేవితపాదసరోజయుగ్మ సం
సారపయోధిలోమునిఁగి • సద్గతిఁగానకయుంటినయ్య యే
రీతిఁగనుద్ధరించెదవొ • దీనదయాపరమూర్తిభక్తమం
దార దయాసముద్ర హరి • దాసజనావన జానకీపతీ॥

ఉ॥ నీకరుణాకటాక్షమున • నేఁటికినిన్ను స్మరించుభాగ్యముం
నాకు లభించెనయ్య నిను • సన్నుతి నీదయఁగోరుచుంటి నీ
రాకను జూచుచుంటి నను • రాగముతో ననుఁ బ్రోవుమంటి న
య్యా కరుణించి నాహృదయ • మందువసింపుము జానకీపతీ॥

ఉ॥ ఏగతినైననిన్ను భజి • యింపఁగఁ జూనితి నేని యప్పుడే
రోగమొ ఖేదమొ మందమొ • రోషసుఖంబులొ ముట్టడించుచున్
బాగుగనూడనియ్యక స్వ • ధ్యానమునంతయుఁ బాడుచేయు న
న్నేగతిఁ జూచి కాచెదవొ • యిట్టిది నాస్థితి జానకీపతీ॥

ఉ॥ క్షీరమునీరమున్ గలియ ♦ క్షీరముఁ గైకొని రాజహంస యా
నీరముఁ ద్రోసివేయుకర ♦ ణిన్ సుగుణంబులనే గ్రహించి నా
నేరములన్ద్యజించి కరు ♦ ణింపు ముదారతఁజూపు మాపదు
ద్ధారకరామ భవ్యగుణ ♦ ధామ రఘూత్తమ జానకీపతీ ॥ 4

ఉ॥ జన్మములందు మానవుని ♦ జన్మమె శ్రేష్ఠ యదెట్టులన్న నా
జన్మమునందజ్ఞానమును ♦ జక్కఁగనార్జనసేయవచ్చు యు
ష్మన్మహనీయశక్తిని వి ♦ చారణఁ జేసి తెలుపవచ్చు నో
చిన్మయరూప రామ నృప ♦ శీలమనోహర జానకీపతీ॥ 5

ఉ॥ భక్తులు రామరామయని ♦ పాడు మహోత్సవముఁ జేయుచుండ న
వ్యక్తిసుఖంబు నాహృదయ ♦ మం దుదయించెను నిన్నుజూడ నా
సక్తియుఁ గల్గెనీభజన ♦ సల్పఁగ వేడుకపుట్టెరామ స
ద్భక్తిని వేగ నాహృదయ ♦ పద్మమునందిడు జానకీపతీ॥ 6

ఉ॥ ఎన్నిపురాణముల్ వినిన ♦ నెన్నియొనర్చిన దైవభక్తి లే
కున్నను నెట్టివారలకు ♦ నుత్తమసిద్ధిలభింపనేర్చునే ?
నిన్నుఁ గనమ్మినాఁడఁ గను ♦ నిర్మలచిత్తుని సన్నొనర్చి నీ
సన్నుతభక్తిమార్గమును ♦ జక్కఁగఁజూపుము జానకీపతీ॥ 7

ఉ॥ భక్తులనోట రామయను ♦ పల్కులయందమృతంబులొల్కు నీ
భక్తికిఁ జాలదెద్దియు న ♦ పారకృపాబ్ధి నీవు భక్తితో
శక్తికొలందినీభజన ♦ సల్పినభక్తవశుండవౌదువో
ముక్తివిధానకారణ ము ♦ ముక్షుజనాశ్రయ జానకీపతీ ॥ 8

ఉ॥ నిన్నొకసారి రామయని ♦ నిర్మలచిత్తముతో వచించినన్
మున్నొనరించినట్టి యఘ ♦ ముల్ నశియించును శ్రీహరీ నినున్
సన్నుతిఁ జేయుచుంటిని బ్ర ♦ సన్నుఁడవై కృపఁజూడుమయ్య ని
న్నెన్నఁగ నెంతవాఁడను గ్ర ♦ హింపుము నా మొఱ జానకీపతీ॥ 9

ఉ॥ తియ్యని తేనెలొల్కు భవ ♦ దీయకథామృతసాగరోర్మి లం
దుయ్యెలలూగ నిమ్మటుల ♦ నూగుచునూగుచు నేగ నేగ నే
నయ్యమృతంబుఁ ద్రావెద మ ♦ హాఘములెల్ల నశించునయ్య రా
మయ్య కటాక్షముంచుము చి ♦ రాయువొసంగుచు జానకీపతీ॥ 10

ఉ॥ రామకథామృతంబు మధు ♦ రంబది గ్రోలెదు వారిపైన శ్రీ
రామకృపాకటాక్షము ని ♦ రంతరమున్ బ్రసరించు నందుచే
క్షేమము గల్గుసంచున వ ♦ చింతురు భక్తులు రాఘవా భవ
న్నామసుధారసంబు రస ♦ నంబునఁ జిల్కుము జానకీపతీ॥ 13

ఉ॥ చక్కెరకంటె ద్రాక్షఫల ♦ సారముకంటెను దేనెకంటెఁ బే
రెక్కిన స్వాదుభక్ష్య మధు ♦ రేక్షు రసంబులకంటె శ్రీప్రమా
చక్కని రామనామరుచి ♦ షడ్రుచులందును లేదు రామ నా
వాక్కున రామనామమును ♦ వర్ధిలఁ జేయుము జానకీపతీ॥ 12

ఉ॥ భక్తులు రామకృష్ణయని ♦ పాడుచునుండ నదేమి చోద్యమో
రక్తిగనుండు శ్రోతకును ♦ రాగము పాఠకులందుఁ గల్గుఁ ద
ద్భక్తిరసంబు తేటపడు ♦ భక్తుల వాక్కున రామనామమే
మౌక్తికభూషణంబఖిల ♦ మంగళహేతువు జానకీపతీ॥ 13

ఉ॥ నీవరనామకీర్తనము ♦ నిన్నుఁ బ్రసన్నునిఁ జేయునయ్య నీ
సేవయు వాంఛితార్థ ఫల ♦ సిద్ధినొసంగు భవత్ప్రపత్తియున్
దీవిభవంబొసంగు భవ ♦ దీయ పవిత్ర పదార్చనంబు శ్రీ
భూవనితాదిభోగ పరి ♦ పూర్ణసుఖంబిడు జానకీపతీ॥ 14

ఉ॥ నిత్యము నీపదార్చనము ♦ నీపదసేవయు నీదుదాస్యమున్
సత్యము పుణ్యకార్యరతి ♦ సజ్జనవృత్తియు దైవభక్తి సాం
గత్యము తుచ్ఛభోగ విము ♦ ఖత్వము శాంతము ధర్మశాస్త్ర పాం
డిత్యము మాత్రమిచ్చి కరు ♦ ణింపు దయాకర జానకీపతీ॥ 15

చ॥ శ్రీహరినామకీర్తనముఁ ♦ జేయ నశించును సర్వపాపముల్
మోహాలతాదిబంధము స ♦ మూలముగాఁ దెగిపోవు నందుచే
దేహమునిర్గమింపఁ గడ ♦ తేరుపథంబు తనంతచేకుఱున్
గా హితవైఖరుల్ పడయఁ ♦ గాఁ గరుణింపుము జానకీపతీ॥ 16

ఉ॥ ఈదినమందుఁ జేయునదె ♦ యెల్లియుఁ గ్రమ్మఱఁ జేయుచుండి మో
హాదులఁ జిక్కి కాలమును ♦ వ్యర్థముగా నొనరించి యెట్లొ నీ
పాదములాశ్రయించి భవ ♦ బంధము వీడఁగ వేఁడుచుంటి నో
హో దయఁజూపరాదె! పురు ♦ హూతవవోనుత జానకీపతీ॥ 17

ఉ॥ కాళ్లను ఘల్లుఘల్లనుచు ♦ గజ్జెలు మ్రోఁగుచు నుండఁ దాబుఱన్
వ్రేళ్లను చిటిటి తాళముల ♦ వేయుచు నృత్యముఁ జేయుచున్ వడిన్
మోళ్లు చిగుర్ప గ్రావచయ ♦ ముల్ గఱఁగంగను నోరునొవ్వఁగా
నాళ్లలయంగఁ బాడుచుఁ గ ♦ నందగు నిన్నొగి జానకీపతీ॥ 18

ఉ॥ నన్నొకసారి ప్రోవుమని ♦ నమ్మి భజించెద నాదు భక్తులన్
మన్ననఁ జేసి ప్రోతు నభి ♦ మానముతోనని చెప్పితీవు ని
న్నిన్ని విధంబులం దలఁచి ♦ యెన్నుచునుంటిఁ బరాకదేల? నా
విన్నపమాలకించుమిఁక ♦ పితూనిఁ జేయుము జానకీపతీ॥ 19

ఉ॥ ఎప్పుడు నీపదాబ్జముల ♦ నెంచి భజింపఁగఁ బూనుకొంటినో
యప్పుడె నాదు పాపచయ ♦ మంతయు వీడెఁ గదయ్య యింక నీ
గొప్పతనంబుఁ జూపి నినుఁ ♦ గొల్చెడు భక్తుని నన్నుఁ బ్రోవఁగాఁ
దప్పదు భక్తరక్షణమె ♦ ధర్మము నీకగు జానకీపతీ॥ 20

ఉ॥ నాలుక నిన్ వచింప శ్రవ ♦ ణంబులు నీకథ లాలకింప నా
కాలము భక్తితోఁ జనఁగఁ ♦ గన్నులు నిన్నుఁ గనంగఁ గాళ్లు దే
వాలయముల్ చొరంగ సక ♦ లాంగములున్ నినుఁ గొల్చుచుండ నా
శీలముఁ బాగుచేసి కృప ♦ సేయుము వేఁడితి జానకీపతీ॥ 21

ఉ॥ నీయభిషేకతీర్థమును ♦ నిర్మలమౌ తులసీప్రసాదమున్
బాయనిదైవభక్తియు శు ♦ భప్రదమౌ పదపద్మసేవయున్
శ్రేయమొసంగుదాస్యమును ♦ శ్రీకరమౌ భవదీయ నామమున్
నాయఘముల్ నశింపఁ గరు ♦ ణన్ సతతంబిడు జానకీపతీ॥ 22

ఉ॥ చెప్పఁగవచ్చు ధర్మములు ♦ చేయుట నాగద దేమికర్మమో!
తప్పనితోఁచినన్ మఱల ♦ దానినచేయుఁగ బుద్ధిపుట్టు నీ
వెప్పుడునాదుదోషముల ♦ నెంచకుమీ ననుబ్రోవనీకిఁకన్
దప్పదు నీపదాశ్రితుల ♦ తప్పుక్షమింపవె? జానకీపతీ॥ 23

ఉ॥ ఏనిముసంబులోన నెవ ♦ డెట్లుచరించుచు నెవ్విసేయునో
వానివిచిత్రగుప్తుఁడొగి ♦ వ్రాయుచునుండుఁ నుదిన్ యముండు దా
నానతినీయఁ గాలభటు ♦ లానికిందగు శాస్తిఁజేయువా
రేనుసహింపఁజాలనది ♦ యెట్లులబ్రోతువో జానకీపతీ!॥ 24

ఉ॥ చేసినదానిఁబట్టి విధి ♦ సృష్టిని మోమున మూఁడుపంక్తులన్
వ్రాసినవ్రాఁత దిద్దఁగల ♦ వాఁడు జగంబులలేఁడు నామ నీ
వాసకిలంబు మాన్చుటకు ♦ సర్వుఁడవయ్యు మహాప్రభావ నే
దోసిలియొగ్గి వేఁడికొన ♦ దుఃఖఁబాపవో? జానకీపతీ॥ 25

ఉ॥ ఆయువునూఱువత్సరము ♦ లందుసగంబును నిద్రమ్రింగు లేఁ
బ్రాయములోనఁ గొంత చని ♦ రిత్వములో నొకకొంత వ్యర్థమై
పోయెడు నన్యకాలమునఁ ♦ బొట్టకునై కడునీచవృత్తులన్
జేయవలెన్ గదా! నిను భ ♦ జించుటయెన్నఁడొ జానకీపతీ!॥ 26

ఉ॥ మంచికిబుద్ధిపోదు చెడు ♦ మార్గములన్ జొరనిందియాళిన్
వంచిజయింపశక్తిగల ♦ వాడనుగానసుమీ త్వదంఘ్రులం
దంచితభక్తినాకొసఁగు ♦ మయ్య భవాబ్ధిఁదరించి మోక్షముం
గాంచెద నింతయేని యుప ♦ కారముసేయుము జానకీపతీ॥ 27

ఉ॥ కాలము పోయెడిన్ బ్రతుకు ♦ కాలము తగ్గెడుఁ గాన నెప్పుడే
పోనో పండుటాకువలె ♦ వింతగ దేహము రాలు నక్కటా!
జాలము సేయకుండ ముని ♦ సన్నుతమౌ భవదీయ నామమున్
జాలఁగ నాదు వాక్కునఁ బ్రి ♦ సన్నము సేయుము జానకీపతీ॥

ఉ॥ కోరినయట్లు పండితుల ♦ కున్ ధనమిచ్చి సమస్తధర్మముల్
సేరిచి కర్మముల్ జరుప ♦ నిర్ధనుఁడన్ సుమి నాదు పూర్వసం
స్కారము చిత్తవృత్తులును ♦ సర్వవిదుండవు నీ వెఱుంగవే?
తారకనామ రామ నను ♦ ధన్యునిఁ జేయుము జానకీపతీ॥

ఉ॥ బూటకమైన వేషములఁ ♦ బొందుగఁ బైకిధరించి డబ్బుకై
వాటముగాఁ బురాణముల ♦ వైఖరి దెల్పెదమంచుఁ గొందఱే
మాటలొ చెప్పుచుందు రవి ♦ మాకు రుచింపవు దేవదేవ ము
మ్మాటికి రామనామమె స ♦ ముష్టము మాకగు జానకీపతీ॥

ఉ॥ వేళకు లేచి కృత్యముల ♦ నేగము తీర్చి సహస్రగీతులన్
బాలుని కైవడిన్ దిరిగి ♦ భార్యసుబిడ్డల నమ్మి వారికై
చాలినయంత రొక్కము వి ♦ శంకటవృత్తి గడింపవెంచి నే
దూలితి నీదు నామమును ♦ దూఱుపలంబిది జానకీపతీ॥

ఉ॥ ఎన్నిభుజించినన్ మఱల ♦ నెప్పటిదో మూత్రపురీష రూపమై
యన్నియుఁ బోవుచుండుఁగద ♦ యాసను వెల్లను వ్యర్థమే కదా!
నిన్ను సదామదిన్ నిలిపి ♦ నిర్మలచిత్తము తోడఁ గొల్చుచున్
సన్నుతిజేయు కృత్యమె ప్ర ♦ శస్తతమంబగు జానకీపతీ॥

ఉ॥ ఆశకు మేరలేదు పర ♦ మార్థవిచారణ మేనిలేదు భూ
మీశుల యూవి కాసపడి ♦ యిల్లును వాకిలినిన్ త్యజించి నే
దేశము పట్టిపోయి కడు ♦ దీనుఁడనై మొఱనాశ్రయింతు లో
కేశ మదీయ కష్టముల ♦ నేల హరింపవు? జానకీపతీ॥

ఉ॥ కాయము నింద్రియంబులును ♦ గట్టిగనుండెడుకాలమందె నా
రాయణ పాహి పాతకహ ♦ రా యనిపల్కఁగ బోధఁజేసి రా
మాయనుమంత్రమున్ హృదయ ♦ మందుననాటుచు రామనామపా
రాయణఁజేయుబుద్ధిని ని ♦ రంతర మియ్యవె జానకీపతీ॥ 36

ఉ॥ నాటకమాశుభంగి భువ ♦ నంబున మర్త్యులు పుట్టి బాల్యమం
దాటలనాడి వశ్యముగ ♦ యౌవనమందు రమించి వృద్ధులై
కాటికిఁ గాళ్లు సాచియును ♦ గాధపుచింతఁగృశించు నోజగ
న్నాటకసూత్రధారక కోఽ ♦ ణార్ ననుబ్రోవుము జానకీపతీ॥ 37

ఉ॥ నాటకమందుఁ బాత్రలుగ కీ ♦ ఱౌళిణ మొక్కొక పాత్రతోడఁ బె
క్కాటల నాడుచున్ యవని ♦ కాంతరభూమికిఁ బోవునట్లె పడిన్
బోటులు పూరుషుల్ గలసి ♦ భోగవిహారులై నటించి యే
పూటనొ సర్వమున్ విడిచి ♦ పోయెద రక్కట జానకీపతీ!॥ 38

ఉ॥ ఎందుకు బొందనెత్తి బ్రతు ♦ కేల ? వృథాశ్రమమొందనేల ? యే
చందము దోఁపకుండె బహు ♦ జన్మజరామరణాది బాధలన్
బొందుటజాలుఁ గావుమిఁక ♦ పుణ్యజనాభయదానదీక్ష గో
విందభవత్పదాబ్జముల ♦ వేడుచునుంటిని జానకీపతీ॥ 39

ఉ॥ జీవితకాలమున్ నిను భ ♦ జింపక వ్యర్థముగా నొనర్చితిన్
ద్భావకనామకీర్తన ము ♦ ధన్ గృపఁ జేసితివేని దాని నే
ద్రావి భవత్కటాక్షమున ♦ ధన్యుఁడనయ్యెద నీదుపాద రా
జీవము లాశ్రయించితిని ♦ శ్రీరఘునాయక జానకీపతీ॥ 34

ఉ॥ కంటెనిరెప్ప యేగతిని ♦ గాచుచునుండునో యట్లు రామ నా
వెంటనునుండి యెల్లపుడు ♦ వేయివిధంబులఁ గావుమయ్య నీ
కంటెఁ బరుండు రక్షకుఁడొ ♦ కండును లేడని స్పష్టమేకదా
తుంటరపోకడల్ తొలఁగు ♦ త్రోవలఁ జూపుము జానకీపతీ॥ 35

ఉ॥ ఎత్తితి నెన్ని జన్మములొ ♦ యెన్ని శ్రమల్ పడియుంటినో మహా
పత్తులనెన్ని పొందితినొ ♦ పాడుభవంబున సౌఖ్యమున్నదే ?
యిత్తరినైన నిన్ను భజి ♦ యించి తరింపఁగఁ జేయు వే ; భవా
వృత్తివిపత్తు నేననుభ ♦ వింపఁగఁజాలను జానకీపతీ॥ 40

ఉ॥ జీవితయాత్రయందుఁ బలు ♦ చిక్కులువచ్చును గాలచక్రమా
యేవిధ మేదినిల్చినను ♦ నెల్లపుడుర్వి జరియించుచుండు రా
జీవదళాక్ష సర్వముఁ ద్య ♦ జించి భవత్పదచింతనంబు నీ
సేవనొనర్పఁ ధన్యతమ ♦ జీవనమియ్యవె జానకీపతీ॥ 41

ఉ॥ ఎంతవయస్సువచ్చినను ♦ నింద్రియనిగ్రహమైన లేదు నా
కెంతయొ భాగ్యముండిన జ ♦ యింపక పోతి ధనాశనైన నా
కింతటినుండి జ్ఞానముద ♦ యించెడురీతి ననుగ్రహించి ని
శ్చింతఁగ నీభవాబ్ధిదరిఁ ♦ జేరఁగఁ జేయుము జానకీపతీ॥ 42

ఉ॥ కోట్లకొలంది జీవములు ♦ క్షోణియునున్నగు పంచభూతముల్
చెట్లను జేమలన్ విధి సృ ♦ జింప యముండుపహరించుచుండు వా
రిట్లొనరించుచుండ మని ♦ కేమిటకుఁదోఁపక యుంటినయ్య యి
ట్లట్లననేల ? నిన్ను శర ♦ ణంటిని బ్రోవుము జానకీపతీ॥ 43

ఉ॥ మోహమదాదిశత్రువులు ♦ ముట్టడివేయుచు నింద్రియమ్ములన్
గేహకళత్ర పుత్ర సుఖ ♦ కీర్తి ధనాశల పాలుచేసి నా
దేహముగుల్లఁజేసినవి ♦ త్రిప్పుచునున్నవి యేమిసేయుదో !
పాహియటంచు నీదుపద ♦ పద్మముఁబట్టితి జానకీపతీ॥ 44

ఉ॥ చిన్నవయస్సులోఁదిరిగి ♦ పెద్దలమాటలఁద్రోసి యెవ్వరే
మన్నను లెక్కసేయక మ ♦ హోదురితమ్ములఁ జేసి యిప్పుడే
నిన్ను స్మరింపఁ బూనితిని ♦ నీకరుణారస వృష్టిధారలం
దెన్నఁడు స్నానమాడఁ జన ♦ నిచ్చెదవో నను జానకీపతీ॥ 45

ఉ॥ తొమ్మిదిద్వారముల్ చెమట ♦ తూట్లనుగల్గిన యట్టిపచ్చితోల్
బొమ్మ నలంకరించుకొని ♦ పొంగుచుఁ గాలముఁబాడుచేసి పా
పమ్ములఁజేసితిన్ బతిత ♦ పావనమౌ హరిభక్తినిప్పుడే
నెమ్మదిలోన నాటితిన్ని ♦ నీవడి పెంపుము జానకీపతీ॥ 46

ఉ॥ దారసుతాదిబాంధవుల ♦ దగ్గఱ నీదుఁగవచ్చుఁగాని సం
సారము సాగరంబువలె ♦ సాగెడు నయ్యెడ దు
ర్భారము దుర్భరంబు భవ ♦ బంధములూడ ముక్తిగల్గునే?
గారవముంచి నన్నికను ♦ గట్టునవేయుము జానకీపతీ॥ 47

ఉ॥ గారడివాని మాయవలెఁ ♦ గన్పడి సర్వమునాశమొందు సం
సార మసారమంచుఁ గనఁ ♦ జాలక మోహమునొందియుండుటన్
సారథిలేని గుఱ్ఱముల ♦ చాడ్పున నింద్రియముల్ చరించి నన్
ఘోరవిపత్తులోనఁ బడఁ ♦ గూల్చెడుఁ బ్రోవవె జానకీపతీ॥ 48

ఉ॥ ఏక్షణమెట్లులుండునో! వి ♦ పత్తులెవచ్చునో! చావెపుడౌనో
యీక్షణమందు నేమొ భవ ♦ దిచ్ఛయెటుండునో గాన నిప్పుడే
యక్షయమౌ త్వదీయ భజ ♦ నామృతముల్ ననుఁ గ్రోలనిచ్చి పా
పక్షయమౌవిధంబుగఁ గృ ♦ పన్ ననుజూడుము జానకీపతీ॥ 49

ఉ॥ తొమ్మిగపెద్దద్వారముల ♦ తోవలమాయకయుండఁ బ్రాణి దే
హమ్మను పంజరంబును వి ♦ హంగము భంగిఁ ద్వజించుగానఁ జి
త్తమ్మునఁ దానకీవపద ♦ తామరసంబుల వేగనిల్పి సౌ
ఖ్యమ్మునఁబొందజేయుము కృ ♦ పాకర శ్రీకర జానకీపతీ॥ 50

ఉ॥ తానొకటిన్ దలంచునెడ ♦ దైవము వేఱుదలంచు నంచు నీ
మానవులెల్లరున్ బలుకు ♦ మాటలునమ్మితి రామ ప్రేమతో
నేనొనరించు కార్యముల ♦ నెల్లనుఁజక్కఁగ సంస్కరించి యీ
మేను తరింపగాఁగను మ ♦ మేయదయాకర జానకీపతీ॥ 51

ఉ॥ పారవిహీనమౌ పనుల ♦ సల్పగ దూఁకుచు నింద్రియాళి సం
పారసుఖంబులన్ దగిలి ♦ సంతస మొందుచునుండుఁగాని యీ
ఘోరభవాబ్ధిలోమునిఁగి ♦ కూలెడుసంగతిఁ గానలేదు ; నా
భారము నీదెయింక హరి ♦ భక్తజనావన జానకీపతీ॥ 52

ఉ॥ కూటికి గుడ్డ కాసపడి ♦ కొల్వొనరించుచు మానవాళికిన్
నోటిని శుద్ధిచేసెడు మ ♦ నోహర రామపదంబు నామదిన్
నాటక యిట్టిరీతి భవ ♦ నాటకి మాడుచు నుంటి నట్టి నా
యాటలమాన్ప నీదు భజ ♦ నామృత మియ్యవె జానకీపతీ॥ 53

ఉ॥ ముష్టికి నష్టిలేమి ఘన ♦ మోదము లొందఁగ హద్దులేదు నీ
యిష్టము రామ యెట్టుల మ ♦ హీతలమందు ననుగ్రహింతువో
భ్రష్టునిఁ జేయకుండ హరి ♦ భక్తినొసంగి తీరఁపజేయుమా
శిష్టజనావనా కుజన ♦ శిక్షణ సద్గుణ జానకీపతీ॥ 54

ఉ॥ మందమతిన్ వివేకివిస ♦ నూసదయుక్తి గనుచుండు వట్లు నీ
వందిత వాదముల్ విసుచు ♦ నస్నమహంబులలో మెలంగుచున్
సుందరమౌ నిజాకృతులఁ ♦ జూపుచు భక్తులుచేయుసత్కృతుల్
పొందవె రామ నేఁడిపు ♦ ప్రాపుగఁగైకొను జానకీపతీ॥ 55

ఉ॥ అక్కఱ వచ్చినన్ బలుపు ♦ రాదినమమ్మనఁ బల్కుచుండు గా
యక్కఱదీరగా నెచట ♦ మందురు పిల్చినఁ బల్కరయ్య ; నే
నిక్కముగా వచించెదను ♦ నిన్నుఁ భజించిన నీమ భక్తులం
దెక్కువ ప్రేమతో సతత ♦ మింపొనరింతువు జానకీపతీ॥ 56

ఉ॥ ఎండకువానకోర్చి విష ♦ యేచ్ఛల నెల్లఁ ద్యజించి కానలో
నుండి తపంబుఁ జేయు వర ♦ యోగులకైనను దుర్లభుండ వై
యుండెదు నీవు భక్తులకు ♦ నో సులభుండవు భక్తవత్సలా !
ఖండితదైత్య భక్తజన ♦ కష్టవిమోచన జానకీపతీ॥ 57

ఉ॥ ప్రాణముపోవువేళ యమ ♦ పాశము లీడ్చుచునుండ శ్లేష్మముల్
ఘ్రాణగళాదిమార్గ మరి ♦ కట్టఁగ నప్పుడుతోఁప దెద్దియున్
వాణియుఁ బైకిరాదు భగ ♦ వత్స్మృతి గల్గునె? యిప్పుడే శ్రిత
త్రాణ మొనర్చు నీ యడుగు ♦ దమ్ములఁ గొల్చెద జానకీపతీ॥ 58

ఉ॥ ఎందఱి నాశ్రయించినను ♦ నెవ్వరుగూడను వెంటరారు గో
విందపదారవిందసుప ♦ విత్రపరిస్మరణామృతంబె మే
మెందుజరింతు మక్కడికి ♦ నేగి జరామరణాది దుఃఖముల్
బొందెద మట్టిఁ బాపి పరి ♦ పూర్ణసుఖంబిడు జానకీపతీ॥ 59

ఉ॥ తల్లియుఁ దండ్రియున్ గురువు ♦ దైవము సర్వము నీవె యింక
యెల్లను రామ! నిన్ గొలుచు ♦ చుండెదఁ గావున నాదుచిత్తమం
దెల్లపుడింపుగాను వసి ♦ యించుచు నన్నుఁ బవిత్రుఁ జేసి నీ
యుల్లమునందు నన్ మఱవ ♦ కుంచుము నిత్యము జానకీపతీ॥ 60

ఉ॥ కోట్లకొలంది ద్రవ్యమును ♦ గూర్చుచునుండిన నేమిలాభమో!
చెట్లను జేమలందుఁ జలి ♦ చీమలు పుట్టలఁ బెట్టుచుండవే?
యెట్లయినన్ సుకీర్తియుద ♦ యింపఁగ దానముఁ జేయకున్న నా
కోట్లధనంబు వ్యర్థమది ♦ కూడనువచ్చునె జానకీపతీ॥ 61

ఉ॥ అందఱి కన్నిరూపములు ♦ నన్నిమతంబుల కన్నివేళ్లలో
డెందములందుఁ దోఁచుచు న ♦ టించు నొకండవు కావె? రామ నీ
యందము జగంబులుండుఁ బర ♦ మాత్మవు నూలవిగాత్మవయ్య నీ
చందము యోగులైనఁ గనఁ ♦ జాలరు ప్రోవవె జానకీపతీ॥ 62

ఉ॥ చండకృశానుభాను ఘన ♦ చంద్రకళాధికపూర్ణ తేజ కో
దండకరా భయార్తిహర ♦ దండధరాదిసురాధినాథ బ్ర
హ్మాండఘురంధరుండవు చ ♦ రాచరమంతయు నిండియున్న నీ
యండను జేరినాఁడ నభ ♦ యంబిడి ప్రోవవె జానకీపతీ॥

ఉ॥ ఒక్కఁడు నవ్వుచుండ మఱి ♦ యొక్కఁడు ధారుణి నేడ్చుచుండు వే
రొక్కఁడు పుట్టుచుండ మఱి ♦ యొక్కఁడు చచ్చుచునుండు నిప్పుడీ
వొక్కని నొక్కచందమున ♦ నుంపవు నీకది చిద్విలాసమే?
చిక్కులు పెట్టకయ్య కృపఁ ♦ జేసెదు స్వామివి జానకీపతీ॥ 64

ఉ॥ నీవు సమస్తలోకముల ♦ నిల్వఁగఁబెట్ట దశావతారివై
స్థావరజంగమంబులను ♦ సర్వముఁ గాచుచునుంటివయ్య నీ
పావనసచ్చరిత్రములు ♦ పన్నగనాయకుఁ డెన్నఁ జాలునే?
దేవ పరాత్పరా వరద ♦ దివ్యకళాలయ జానకీపతీ॥ 65

ఉ॥ ఆవిధి నిద్రపోవ సక ♦ లాగమముల్ హరియించి సోమకుం
డావనధిన్ జరించి జల ♦ మందున డాఁగఁగ మత్స్యమూర్తివై
నీవపుడేగి నీటను ము ♦ నింగి దురాత్ముని వానిఁ జంపి వే
దావళిఁ దెచ్చి యిచ్చితివి ♦ యట్టిఘనుండవు జానకీపతీ॥ 66

ఉ॥ వాసుకి త్రాడు మందరము ♦ వాసిగఁ గవ్వముగా నమర్చి దే
వాసురు లబ్ధిఁ జిల్కుతఱి ♦ నందు నగంబు మునుంగుచుండ మం
థాసనమొప్పఁ గూర్మముగ ♦ నై యమృతం బుదయించునట్లుగాఁ
జేసిన పుణ్యమూర్తివి ప్ర ♦ సిద్ధయశుండవు జానకీపతీ॥ 67

ఉ॥ ఈక్షితిమండలంబు చలి ♦ యించి జలంబుల మున్గిపోనఁ ద
ద్రక్షణ మాచరింపఁగ వ ♦ రాహమవై చని నీదుముట్టెపై
నాక్షితి నెత్తి బంతివలె ♦ నచ్చటనే నిలఁబెట్టి యా హిర
ణ్యాక్షునిఁ జంపి భూతలము ♦ నాపినవాఁడవు జానకీపతీ॥ 68

ఉ॥ ఆ దనుజేంద్రుఁడా జనకు ♦ నైనఁ ద్యజించి విరాగియై భవ
త్పాదసరోజముల్ పరమ ♦ భక్తిని నమ్మి భజించుచుండు ప్ర
హ్లాదునిఁ బ్రోవ స్తంభమున ♦ నప్పుడె శ్రీ నరసింహమూర్తివై
యా దితిపుత్రుఁ జంపితివి ♦ యద్భుతమూర్తివి జానకీపతీ॥ 69

ఉ॥ హాటకకోటిమణి ♦ హీరవిలాసితసన్ముఖా కళా
స్తోమసువర్ణకుండల సు ♦ శోభితకర్ణయుగా వరాంగదా
హైమ విచిత్రరత్నకలి ♦ తామల మౌక్తికహారరమ్య శ్రీ
రామ మనోజ్ఞవేష వడి ♦ రమ్మిటు చూచెద జానకీపతీ॥ 76

ఉ॥ కాంచన పద్మరాగమణి ♦ కంకణభూషితపాణిపల్లవా
చంచలరత్న కాంతి విల ♦ సద్రశనాంచితసూక్ష్మమధ్య రే
ఖాంచల పీతవస్త్ర వివి ♦ ధాభరణార్చితపాదపద్మ ర
త్నాంచిత భూషణాఢ్య లలి ♦ తాంగుళి ప్రోవుము జానకీపతీ॥ 77

శ్రీవిలసత్పవిత్రితుల ♦ సీదళచందనపుష్పభూషితా
పావనసద్గుణాభరణ ♦ భక్తిని నమ్రసమస్తభక్త సం
సేవితసుందరాంఘ్రి సరి ♦ సీరుహ భక్తజనావనప్రియా
కావుము రామ సర్వవిధ ♦ కల్మషనాశన జానకీపతీ॥ 78

ఉ॥ వేదసమస్తశాస్త్రచయ ♦ వేద్యమహాగుణ షోడశోపచా
రాదిసమర్చితా సుహృద ♦ యా సుకవిశ్వరసంస్తుతిప్రియా
స్వాదుఫలాన్నభోగ మున ♦ వైభవదానసుహృష్టమానసా
నీదు కృపాకటాక్షముల ♦ నిల్పుమువారెడ జానకీపతీ॥ 79

ఉ॥ తుంబురు నారదాదులు శ్రు ♦ తుల్ సరిగా భరతప్రవీణతో
దంబుల మీటుచుండియు సు ♦ ధారసమొల్కఁగ బాడుచుండి నృ
త్యంబునొనర్చి సొక్కెడర ♦ హాసముఖుల్ నినుఁ జేయుచుండు కా
లంబుననుండు నీముఖవి ♦ లాసముఁజూపవె జానకీపతీ॥ 80

ఉ॥ ముద్దులు మూటగట్టు నగు ♦ మోమునఁదళ్కులుకుల్కుచుండఁ బె
ల్లొద్దికసొంపునింపు మధు ♦ రోక్తులు తేనెలఁ జిమ్ముచుండ మే
లద్దము బోలుచెక్కులుల ♦ హాసకళాంగన నాట్యమాడ నీ
ముద్దుమొగంబుఁ జూపుచుఁ బ్రి ♦ మోద మొసంగుము జానకీపతీ॥ 81

ఉ॥ దాశరథీ సుబాహుముఖ ♦ దైత్యహరా మునియజ్ఞరక్షకా
కౌశికదత్తదివ్యజయ ♦ కారణదివ్యమహాస్త్రజాల గౌ
రీశధనుర్విభంజన మ ♦ హీతవయామహృదయాబ్జభృంగ స
ర్వేశ చిదాత్మ రామ పర ♦ మేశ్వర కావుము జానకీపతీ॥ 82

ఉ॥ భానుకులాబ్ధిసోమ జిత ♦ భార్గవరామ మహాపరాక్రమా
మానవిభూషణా సుగుణ ♦ మండిత పౌరజనాభివందితా
యూనకులాభిమాన సుస ♦ హాయాదరవత్సల రామచంద్ర యీ
నే నొనరించు సత్కృతిని ♦ నేడు గ్రహింపుము జానకీపతీ॥ 83

ఉ॥ వారితసర్వరాజ్య పిత్రు ♦ వాక్పరిపాలనసద్వ్రతైక దీ
క్షారత పీతరాగ విల ♦ సన్మునివేష వినీతభావ సీ
తాంచితోపచార కృతి ♦ దక్షిణలక్ష్మణసంయుతా జగ
త్కారణ రామ భక్తగతి ♦ కావు మతీంద్రియ జానకీపతీ॥ 84

ఉ॥ దీపదరూపగా మహిత ♦ దివ్యకళావిలసన్ముఖాంబుజా
మానవరూప శాంతగుణ ♦ మండన తిక్తసమస్తవైభవా
మానసరాజహంసవర ♦ మానసతీర్థ పవిత్రదండకా
కాననవాస దైత్యగణ ♦ ఖండన కావుము జానకీపతీ॥ 85

ఉ॥ వానరరాజమిత్ర సుగ ♦ వారిధిబంధన పండితా మను
త్సానుభుజోపవిష్ట వర ♦ తూణశరాసన ముష్టిభూషితా
దానవవంశతూల ఘన ♦ దావసముజ్జ్వలదగ్ని హోత్రి కో
పానలదగ్ధదైత్య కరు ♦ ణామృతవీక్షణ జానకీపతీ॥ 86

ఉ॥ రావణ కుంభకర్ణులను ♦ రక్కసులన్ వధియించి జానకీ
దేవినిగూడి వేడ్క జల ♦ ధిన్ వడిదాటి సుఖంబుగా నయో
ధ్యావరరాజధానిని శు ♦ భాసనమందు వెలుంగునట్టి ధ
ర్మావన భక్తరక్షణ ప ♦ రాయణ ప్రోవుము జానకీపతీ॥ 87

ఉ॥ గౌతముఁ డల్గి శాపమిడఁ ♦ గాననమందు నహల్య రాయిదై
యాతపశీతవాతముల ♦ నార్తినిబొంది కృశించుచుండ ను
ద్ధూతభవత్పదాబ్జగత ♦ ధూళి విదల్చుచు సాధ్విగాఁగఁ ద
త్పాతకమెల్లఁ బాపిన కృ ♦ పానిధి ప్రోవవె జానకీపతీ॥ 88

ఉ॥ ఎంగిలిపండ్లనా శబరి ♦ యియ్యఁగ భక్తికిమెచ్చి వానిసే
వింగొనుచు భక్తురాలని యు ♦ మేయ కృపన్ బ్రోడసూపి దానిహృ
ద్ధింగములో నటించితివి ♦ రమ్మనవావదియేల? రామ నీ
మంగళదివ్యరూపమొక ♦ మాటిటుచూపుము జానకీపతీ॥ 89

ఉ॥ పావనమైన పంపకడఁ ♦ బావని సెప్పగఁ బోయిచూచి సు
గ్రీవుఁడు వేఁడ నీవు నని ♦ కిం జని వాలినిఁ జంపి రాజ్యమం
దావనచారినుంచి శర ♦ ణాగతరక్షణసేయు లేదె? నన్
గావుమటంచు వేఁడినను ♦ గన్నులఁ జూడవొ జానకీపతీ॥ 90

ఉ॥ కావుమటంచు శాంతమొలు ♦ కన్ శరణాగతుఁడౌ విభీషణున్
బ్రోవఁగ రావణున్ దునిమి ♦ పూర్ణదయన్ వెలిపుచ్చి వానికిన్
నీవల రాజ్యమిచ్చి కరు ♦ ణించితివయ్య మహానుభావ నీ
సేవను జేయుచుందు దయ ♦ సేయవె నాయెడ జానకీపతీ॥ 91

ఉ॥ నీదు పదారవిందముల ♦ నిశ్చలభక్తినిఁ గొల్చుచుండు ప్ర
హ్లాద విభీషణాదుల ను ♦ హాదయతోఁ గని కావలేదె? నీ
వాదరముంచి యీకరుణ ♦ మందును నాకుఁ బ్రసన్నమూర్తివై
నీదయజూపినన్నుఁ గరు ♦ ణించుట తోఁపదె! జానకీపతీ॥ 92

ఉ॥ నీచరణంబులన్ గొలుచు ♦ నిశ్చలభక్తికిఁ జాలదెద్దియున్
బ్రోచిననీవ ప్రోవవలెఁ ♦ బూర్వము భక్తుని రామదాసునిన్
గాచి యనుగ్రహించితివి ♦ కాదె విపత్తులు భక్తులొందినన్
జూచి సహింపఁజాలుదువె? ♦ సూర్యకులోత్తము జానకీపతీ॥ 93

ఉ॥ దుష్టులు దానవాంశజులు ♦ దోర్బల గర్వమునొంది భూమిపై
నిష్టమువచ్చినట్లు చరి ♦ యించి మహాత్ములఁ బాధపెట్టుచుం
గష్టము గల్గఁజేయఁ గని ♦ గ్రక్కున శ్రీబలరామమూర్తివై
ముష్టికు నాసురాత్ములను ♦ మొత్తితి వచ్యుత జానకీపతీ॥ 94

ఉ॥ గోకులమందుఁబుట్టి యల ♦ గొల్లల యిండ్లను వెన్నదొంగవై
పోకుచు నాటపాటలను ♦ బాగుగఁ జూపుచు గొల్లవారిపై
శ్రీకరమౌ కృపారసముఁ ♦ జిమ్మిన కృష్ణుఁడ వీవకాదె? రా
మా కృపఁజూపు దివ్యమహి ♦ మా ననుఁబ్రోవుము జానకీపతీ॥

ఉ॥ మున్నలకుబ్జ గంధమిడి ♦ మోదముతో నినువేఁడగా నె యా
విన్నపనూలకించి కడు ♦ వేడుక దానిని సుందరాంగిగా
కన్నను జేసి యామగువ ♦ కామిత మిచ్చియుఁ బ్రోచినట్టి యా
వెన్నుఁడవీవకాదె? నిను ♦ వేఁడితి ప్రోవుము జానకీపతీ॥ 96

ఉ॥ ద్రౌపది మానభంగమున ♦ రక్ష పరాత్పర యంచు వేఁడఁగా
నీపనులన్ని మానుకొని ♦ నీవుమహాలములిచ్చి యామె నా
యాపదనుండి కాచితివి ♦ యాకరుణానిధి నీవుకాదె? నా
పాపమదేమొకాని చెవిఁ ♦ బట్టవునా మొఱ జానకీపతీ॥ 97

ఉ॥ కొంచెముగూర్చి గుప్పెడటు ♦ కుల్ నిరుపేద కుచేలుఁడియ్య భ
క్షించి సమస్తమిచ్చి కృప ♦ చేసినకృష్ణుడవీవుకాదె? నీ
వించుకయైన నాస్థితి గ్ర ♦ హింపవు పిల్చినబల్కవే? కటా
క్షించుటకై దినేశకుల ♦ శేఖర వేఁడెద జానకీపతీ॥ 98

ఉ॥ క్రూరులు దానవాంశజులు ♦ కుంభిని యందుదయించి వైదికా
చారగరిష్ఠులై పసులు ♦ చంప నశక్యులునై చరింపఁగా
వారికి నాస్తికప్రబల ♦ వాదమునేర్పి బౌద్ధమూర్తివై
నేరుపుగావధించితివి ♦ నీసముఁడెవ్వఁడు? జానకీపతీ॥ 99

ఉ॥ భూతలమందుఁ గల్కివయి ♦ పుట్టి తురంగము నెక్కి ఖడ్గముం
జేతధరించి దుష్టులు న ♦ శింప వధించి సమస్తధర్మని
ర్ణేతవుగాన శాంతిని ధ ♦ రిత్రిని నిల్పెదవవ్యయా పరం
జ్యోతి వనంతరూపుఁడ వ ♦ జుండవుబ్రోవవె జానకీపతీ॥ 100

ఉ॥ శ్రీయుతశంఖచక్రితుల ♦ సీదళదామ విరాజితాంగ నా
రాయణ రామకృష్ణ పర ♦ మాత్మ నిజాశ్రితపారిజాత రా
మాయణ వర్ణనీయ మహి ♦ మా పరిపూర్ణకటాక్ష శ్రీజగ
న్నాయక శ్రీనివాస కరు ♦ ణానిధి ప్రోవవె జానకీపతీ॥ 101

మాధవ కేశవా దనుజ ♦ మర్దన పద్మదళాక్ష వామనా
శ్రీధర వాసుదేవ నర ♦ సింహ ముకుంద హరీ జనార్దనా
సాధుజనావనా నిగమ ♦ సన్నుత పంకజనాభ విష్ణు లో
కాధిప రామచంద్ర పురు ♦ షార్థఫలప్రద జానకీపతీ॥ 102

ఉ॥ తొల్లి గజేంద్రుఁడా మొసలి ♦ తోడను బోరగలేక దీనుఁడై
తల్లడమొంది పాహియని ♦ ధ్యానముఁ జేయుఁగ వేగఁబోయి నీ
నల్లి రిపుం వధించియపు ♦ డాగజరాజును గాచినాఁడవే ?
సల్లలితావతార ననుఁ ♦ జల్లఁగజూడుము జానకీపతీ॥ 103

ఉ॥ రామగుణాభిరామ రఘు ♦ రామ మనోహరనామ దేవ శ్రీ
రామ జగత్రయావనఘ ♦ రంధర స్వాశ్రిత కల్పవృక్ష నీ
నామములెట్లుపల్కిన మ ♦ నస్సు సుఖించును రామచంద్ర నీ
నామము మోక్షదాయకము ♦ నాకుఁబ్రియంబది జానకీపతీ॥ 104

ఉ॥ దాసునితప్పులన్నియును ♦ దండముతో సరియన్నరీతి నా
దోసములెల్లనీభజన ♦ తోసరి రాఘవరామ నేను నీ
దాసుఁడనయ్యె నట్టి మజవ ♦ ధర్మముగాదెఁక ప్రేమయుంచి నీ
భాసురసత్కటాక్షములఁ ♦ బంపుము నాపయి జానకీపతీ॥ 105

# జానకీపతిశతకము.

ఉ॥ నీచరణారవిందముల ♦ నిత్యముఁగొల్చెడు భాగ్యమిమ్ము నీ
తాచకితాక్షి కైరవసు ♦ ధాకర పాలితలోక భక్తర
క్షాచరణైకచిత్త పవ ♦ నాత్మజసేవితపాదపద్మ భ
ద్రాచలరామ నాపయిఁగ ♦ టాక్షము నుంచుము జానకీపతీ॥ 106

ఉ॥ రామపదంబు మంగళక ♦ రంబది సర్వసుఖప్రదంబు శ్రీ
రామనబీజముల్ దురిత ♦ రాశిహరంబులు రాఘవేంద్ర నీ
నామము సంస్మరించెడు జ ♦ నంబుల కాపదలుండునే ? పరం
ధామ భవత్ప్రసాదమున ♦ ధన్యుఁడనైతిని జానకీపతీ॥ 107

ఉ॥ సూర్యకులోత్తమా భువన ♦ సుందరవిగ్రహ శౌర్యధైర్య గాం
భీర్యదయావతంస రణ ♦ భీకర చండపరాక్రమాఢ్య సత్
కార్యధురంధరా సకల ♦ కామితదాయక రామ ! అయ్యవా
చార్యసమర్చితాంఘ్రిజల ♦ జద్వయ ప్రోవుము జానకీపతీ॥ 108

గద్య.

శ్రీ మదాంధ్రదేశ పింజహాన శ్రీకృష్ణానదీతీరస్థ శ్రీకాకుళక్షేత్రవాస్తవ్య
శ్రీమచ్ఛ్రీరంగం వేంకటాచార్య జ్యేష్ఠపుత్ర శ్రీరామ కృపాకటాక్ష
లబ్ధ కవితాప్రభావ శ్రీరంగం అయ్యవారాచార్య విరచిత
శ్రీరామార్పిత శ్రీమదపూర్వ జానకీపతిశతకము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

---

ఉ॥ అతులయశఃప్రదంబు సక ♦ లాఘ వినాశకరంబు జానకీ
పతి శతకంబు నిత్యమును ♦ భక్తిఁబఠించిన విన్న వారి కా
శ్రితజన కల్పవృక్షమగు ♦ శ్రీరఘురామ పరాత్పరుండు సం
తతము సమస్తభోగ సుఖ ♦ దాయకుఁడై సిరులిచ్చిప్రోచెడిన్.

---

# మావద్ద వెలకు దొరకు గ్రంథములు.

—————:0:—————

| | | | |
|---|---|---|---|
| 1. | స్తుతిరత్నమాల | ... | 0—2—0 |
| 2. | సుజనశతకము | ... | 0—2—0 |
| 3. | అష్టోత్తర జానకీపతి శతకము. | ... | 0—2—6 |
| 4. | వర్ణనాకల్పవల్లి | ... | 0—6—0 |
| 5. | చీట్లపేక చిద్విలాసం | ... | 0—2—0 |

వలయువారు——

భార్గవీవిలాస్,

శ్రీకాకుళం,

దివి తాలూకా,

కృష్ణాజిల్లా.

